## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015920

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

స్వర్ణకిరణావళి

-౧-



# ఆదర్శరత్నమాల



రచయిత:

వెంపటి జానకీదేవి

•

ప్రకాశకులు:

ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ

తెనాలి

1948

వెల: అ. 14.

# ప్రవేశిక :

పుణ్యచరితాత్మక స్త్రీపురుషుల పాదచిహ్నములచే పవిత్రీభూతమైన భారతదేశేతిహాసము రత్నస్థగితము. ఆకసము నందు దేదీప్యమానకాంతిపుంజములతో విరాజిల్లు తారలు అంధకారమున పాంథులకు మార్గదర్శక లైనట్లు, ఈ పావనచరితుల జీవగీతికలు ఎల్లకాలముల వారలకు అజ్ఞాన తిమిరమును బాపు దివ్యజ్యోతులవలె మెఱయుచున్నవి.

అట్టి పూజ్యజనావళి నుండి సౌశీల్యముచే గాని, విజ్ఞానసంపత్తిచే గాని, శౌర్యసాహసకృత్యములచే గాని, దేశాభిమానపరతంత్రతచే గాని, సేవాతత్పరతచేగాని, మహా దార్యాది గుణవిశేషములచే గాని, తమ యుత్తమజీవిత ములను పుణ్యవంతములుగ జేసికొని, యెల్లకాలము వారికి నాదర్శప్రాయులైన కొందఱ స్త్రీపురుషుల చరిత్రలు ఈ సంపుటి యందు సుబోధక మగునటుల సులభశైలిని వ్రాయబడినవి. ఇట్టి యాదర్శరత్నముల సచ్చరిత్రపరిచయముచేత పాఠకులు విజ్ఞానవల్లికను వృద్ధిజేసికొని, తమ ఆదర్శ జీవితకుసుమములచే భారతదేవీమూర్తిని అలంకరించెదరుగాక.

వెంపటి జానకీదేవి

# శీర్షికలు:

## ఒకటవ భాగము



## రెండవ భాగము



# ఆదర్శరత్నమాల

## ఒకటవ భాగము

*
* *

### ఒకటవకథ 1 బమ్మెరపోతరాజు

పురాణాంధ్రకవులలోని కెల్ల బమ్మెర పోతరాజు అగ్రగణ్యుడు. జగద్విఖ్యాతిగాంచిన పోతన తెనుగు గ్రంథకర్తల యందేకాక ప్రపంచమందలి కవులలోగూడ ప్రఖ్యాతిగాంచిన వాడన్నచో నతిశయోక్తిగాదు. 'భోగినీదండకము', 'వీరభద్రవిజయము' అను గ్రంథములను రచించినను 'ఆంధ్రభాగవతము' మూలముననె పోతనామాత్యుడు ప్రణుతిగాంచినాడు. పోతన్నను ప్రస్తుతింపని ఆంధ్రుడు లేడు. సంస్కృతాంధ్రభాషలలో సంపూర్ణ పాండిత్యమును సంపాదించిన పోతన్నకు సాటిలేని యాతని భగవద్భక్తి మెఱుగు వెట్టెను.

పోతన్న యుభయభాషా పాండితి వానికి పాఠశాలలందుగాని, గురు సన్నిధానమునందుగాని యలవడినదిగాదు. అంతయు పరమేశ్వర ప్రసాదితము. పోతన్న క్రీ॥ శ॥ 1400 ప్రాంతమున కేసనమంత్రి, లక్కమాంబయను పుణ్యదంపతులకు జన్మించెను.

ఈతడు కౌండిన్యసగోత్రుడు; నియోగిబ్రాహ్మణుడు. వీని జన్మస్థానము కడపమండలములోని 'ఒంటిమిట్ట' యని కొందఱు, నైజామురాజ్యములోని 'ఓరుగల్లు' యని మఱికొందరును వ్యవహరించుచున్నారు.

పోతన్న చాల బీదకుటుంబములోనివాడు. వ్యవసాయమె యీకుటుంబముయొక్క ముఖ్యజీవనాధారము. దానికి దగినట్లు పోతన్నయు పొలముదున్నుట, పసువులనుమేపుట మొదలగు వ్యవహారములందే మగ్నుడై, తీరికవేళల యందు సరస్వతినారాధించుచు తృప్తి జెందుచుండెను. అట్టిస్వయంకృషివలననే యితనికి కవితాభిరుచియు, సహజపాండిత్యమును గలిగెను.

ఇట్లుండ నొకనాడుపోతన పసువులను మేపుచుండగ చిదానందుడను యోగి వానిముఖలక్షణములను గాంచి యచ్చరు వొంది, రామమంత్రోపదేశము గావించెను. అందువలననె యూపసులకాపరికి సాటిలేని పాండితీగరిమయు, నెన్నరాని కవితాశక్తియు, మొక్కవోని దైవభక్తియు గల్గెనని వాడుక.

## 2

పోతన్న శైవమతస్థుడైనను, చిదానందయోగియొక్క రామమంత్రోపదేశముచే నాతడు విష్ణుభక్తిపరాయణుడయ్యెను. శ్రీరామచంద్రుడే స్వప్నమునందు పోతన్నకు దర్శనమొసంగి శ్రీమద్భాగవతమును రచింపుమని చెప్పెనని గాథకలదు. దీనికి తార్కాణముగ పోతన్నయే యిట్లు చెప్పికొనినాడు.

"పలికెడిది భాగవతమఁట
పలికించెడివాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగనేలా?"

పోతన్న సద్భక్తుడగుటచే దేవునియందే ఆశను, ఆశ్రయములను నిలుపుకొని యుండెను. రాజాశ్రయమన్నను, రాజపోషణమన్నను వానికిష్టములేదు. పోతన్న బావమఱదియగు

శ్రీనాథకవి రాజుల కొలువుకూటములజేరి, పెక్కు కబ్బములను వారి కంకితమునిచ్చి యపారధనము గడించెను. అట్టిపని పోతన్నకు నీచముగ దోచెను. రాజుల నాశ్రయించి తన దారిద్ర్యమును పోగొట్టుకొనుమని శ్రీనాథు డెన్నిమాఱులు సలహో నిచ్చినను పోతన్న నిరాకరించెను. ఈశ్వరభక్తి సర్వోత్కృష్టము. సరస్వతినారాధించుట సర్వసౌఖ్యదాయకము. అట్టితఱి భోగలాలసులును, చంచలమనస్కులునునగు నరేంద్రుల నేల కొలువవలయునని పోతన వాదము.

"బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁగూడుభుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతరసీమల గందమూల గౌ
ద్దాలికులైననేమి? నిజదారసుతోదర పోషణార్థమై"

అని యొకానొకప్పుడు శ్రీనాథునకు పోతన బదులు చెప్పెను.

దీనిమూలమున భగవద్భక్తుడగు పోతన్నకు రాజసేవ యెంత గర్హ్యమైనదో తెలియుచున్నది. పోతన్న భాగవతమును రచించుచున్నాడని తెలిసి సర్వజ్ఞసింగమహీపాలుడు ఆ గ్రంథమును తనకు గృతియిమ్మని యా కవివరేణ్యునకు గానుకల నంపెను. పోతన యందులకు నిరాకరించి శ్రీహరి పేరనే భాగవతమును రచించెను.

## 3

పోతన్నయొక్క భక్తి విశేషమునుగూర్చియు, మహిమను గూర్చియు ననేక గాథలున్నవి. అన్నియు సత్యములు గాకపోవచ్చును. కాని శ్రీ భాగవతగ్రంథ రాజమే యతని

ప్రతిభకు దార్కాణము. భాగవతమును పోతన సంస్కృత భాషనుండి యనువదించినను నది స్వకల్పిత కావ్యమువలెనే విరాజిల్లుచున్నది. వర్ణనాంశములను, భక్తి విషయములను గొన్ని పెంచి వ్రాయుటయే కాక పోతన మూలమునందు లేని మఱికొన్ని కథలనుగూడ జేర్చి, తన గ్రంథము మాతృకకంటె వేయి మడుంగులు మిన్నయగునట్లు చేసెను.

శ్రీ కృష్ణలీలలను, విహారములను వివరించు పట్ల పోతన భాగవతమున వాడిన పదప్రయోగ మెంతయును మెచ్చదగియున్నది. ఆతని కవిత్వమున గల యమకము, అనుప్రాసములు, అలంకారములు చదువరులకు మిగుల నానందమును గల్పించును. మందార మకరంద మాధుర్యమును గ్రోలించును; నిర్మలమందాకినీ వీచికల విహరింపజేయును. పోతన భాగవతమునందలి ప్రతి ఘట్టమునందును, ప్రతి పద్యమందును భక్తిరస ముప్పతిలుచుండును. భక్తి జ్ఞానవైరాగ్యములు పోతనయందు ప్రతిఫలించినవని చెప్పదగును. ఆ త్రివేణీ సౌభాగ్యమే వాని పాండిత్యమునందును, కవిత్వమునందును, భక్తి పారవశ్యమునందును సాక్షాత్కరించినది.

సాధుసత్తముడును, భక్తశ్రేష్ఠుడును, నిర్మలజీవియునగు బమ్మెరపోతన తన చర్యలచేతను, కృతులచేతను, జీవితమును సార్థకమొనర్చుకొనెను. ఆ పుణ్యపురుషుని పదచిహ్నము లాంధ్రులకు పవిత్రమార్గదర్శికలై యలరారుచున్నవి. పోతన కవితా ప్రపంచమున కాదర్శరత్నమై వెలయుచున్నాడు.

రెండవ కథ

## అశోకుడు

# 1

సౌజన్యతచేతను, పరోపకార పారీణతచేతను, రాజ్యామేలి కీర్తిగాంచిన హైందవ సార్వభౌములలో అశోకచక్రవర్తి యొకడు. వందలకొలది వత్సరములు గడచినను అశోకుని పవిత్ర నామము భారతదేశముననె కాక ప్రపంచమున నెల్లెడల నల రారు చున్నది. అశోకుని ధర్మచక్రమే నేడు మన జాతీయపతాక ము నలంకరించి దేశమును ధర్మపథమున నడుపుచున్నది.

అశోకుని తండ్రియగు బిందుసారుడు పాటలీపుత్రమును రాజ్యస్థానముగ జేసికొని మగధరాజ్యాధిపతియై యుండెను. అశోకునితల్లి సుభద్రాంగి పట్టమహిషులలో నామె స్థానము కొంచెము తక్కువదిగ నుండుటచే నామె కుమారుడగు అశో కునకు రాజాదరణ మంతగ లేదు. అయినను సుభద్రాంగి చింతి లక కుమారునికి దగిన విద్యాభ్యాసమును గావింపుచుండెను. అశోకుడు విద్యాసక్తుడై గురువులను గౌరవముతో బూజించుచు వారు చెప్పెడి విషయములను శ్రద్ధతో దెలిసికొనుచు, దిన దినాభివృద్ధియగు జ్ఞానముతో నలరుచుండెను. అశోకునిగాంచిన వారందఱు ముందుముందాతడు మంచి యదృష్టవంతుడును, కీర్తిశాలియును గాగలడని నమ్ముచుండిరి.

కొంతకాలమునకు బిందుసారుని యధీనమందున్న తక్ష శిలయందు అంతఃకలహములు పొడసూపెను. అచ్చటి ద్రోహుల నణచివైచి శాంతిని నెలకొల్పుటకై బిందుసారుడు తన పెద్ద

కుమారుడును, ప్రియపుత్రుడుననగు సుషేముని బంపెను. కాని యాతడు నిష్ప్రయోజకుడై తిరిగివచ్చెను. అంత రాజు అశోకుని బంపెను. ఆతడు విప్లవనాయకులను గలిసికొని, కలహమునకు గారణమరసి చేయవలసినది చేయుదునని చెప్పి వారిని సమాధానపఱచి, శాంతిని స్థాపించి తిరిగివచ్చెను.అప్పుడు వాని పాలనాచతురతయు, ఉదారహృదయమును నందఱకును విశదమయ్యెను. బిందుసారుడుకూడ అప్పటినుండియు అశోకుని యందు మక్కువగల్గి యుండెను

మఱికొంతకాలమునకు బిందుసారుడు మరణించెను. చెంతనున్న మంత్రులు అశోకుని రాజ్యార్హునిగ బ్రకటించిరి. ఈ వార్త వెంటనే దూరముననున్న నగరమునందలి సుషేమునకు దెలిసెను. ఆత డాతురతతో పాటలీపుత్రమునకు తిరిగివచ్చి, అశోకునితో సమరమునకు గడంగెను. దురదృష్టవశమున సుషేముడు మరణించెను. అయినను వాని యనుచరులు అశోకుని బాధింపజొచ్చిరి. అందుచేతను, దేశముయొక్క శాంతి భద్రత కొఱకును, అశోకుడు కాఠిన్యమునుబూని దుష్టవర్తనులను నిర్మూలము జేసెను.

## 2

అశోకుడు సింహాసన మెక్కినపిదప రాజ్యవైశాల్యమును పెంపొందింపవలెనని తలంచెను. అందుచే నాతను గొప్పసేనలను సమకూర్చి పరిసరరాజ్యములను బెక్కింటిని జయించెను. మఱియొకమారు దక్షిణముననున్న కళింగరాజ్యముపై దండెత్తెను. అందు వేనకువేలు సైనికులు మరణించిరి. యుద్ధభూమి

యందు నెత్తురు కాల్వలై ప్రవహించెను. ఆ దృశ్యమునుగాంచి అశోకుడు పరితపించెను. ఎద్దియోశక్తి వానిలో ప్రవేశించి వాని మనస్సును కలతబెట్టెను. ఆ సమయముననే కొందఱు బౌద్ధ భిక్షువులు అశోకుని కలిసికొని "రాజేంద్రా, సర్వమును దెలిసిన మహనీయుడవు. నీ యొక్కనికై యెందఱు ప్రాణములను గోల్పోయిరో తిలకించితివా? ప్రాణహింసయందు నీకింత ప్రీతి యెందులకు? జీవ దండనయందు నొకటిగాదా? మా బుద్ధభగవానుడు శాసించిన అహింసాధర్మము నెఱిగి యీ దారుణ చర్యలను చాలింపుము" అని మనవిచేసిరి.

అదియే అశోకుని జీవితములో గొప్పమార్పునకు గారణము. ఆనాటినుండియు అశోకుడు యుద్ధము చేయనని తీర్మానించుకొనెను. అంతియెకాక దేశమునందలి గొప్ప బౌద్ధపండితులను రావించి, వారి మూలమున బౌద్ధమత సూత్రములను బూర్తిగ దెలిసికొని యనుసరింప మొదలిడెను. సత్యమే ధర్మము, ధర్మమే జయము, సౌభ్రాత్రమే సౌభాగ్యకరము, అహింసయే ఆముష్మిక ప్రదాయిని, మానవసేవయే ముక్తిదాయకము — అని యీసూక్తు లందలి సారమును గ్రహించెను. ప్రజల నందఱను గూడ గ్రహించునట్లు చేసెను.

మఱియును ప్రభుత్వోద్యోగు లెవరును లంచములను దీసికొని ప్రజలను పీడింపకూడదని యాజ్ఞాపించెను. దారుణములగు పన్నులను, శిస్తులను నిషేధించెను. ప్రజల జ్ఞానాభివృద్ధికై పాఠశాలలను నిర్మించెను. రోగనివృత్తికై చికిత్సాలయములను నెలకొల్పెను. బాటసారుల సౌకర్యమునరసి బాటలవెంట వృక్ష

ములను బెంచెను. అచ్చటచ్చట బావులను త్రవ్వించెను. ఇవ్విధముగ నెడతెగని ప్రజోపకార కార్యములచే అశోకుడు తనరాజ్యమునందు సంతృప్తి నెలకొల్పెను.

# 3

ఆనాటికానాడు అశోకునికి బౌద్ధమతమునందు మమకారము హెచ్చెను. తుదకామతమును స్వీకరించి రాజకార్యములను మంత్రులకు నొప్పచెప్పెను. తన కాలమంతయు బౌద్ధమత వ్యాప్తియందే వినియోగించెను. అదిచూచి బౌద్ధభిక్షువులెందరో యచ్చటికి జేరిరి. అశోకుడు వారి కొఱకు విహారములను నిర్మించెను. బౌద్ధమత ప్రచారమునకు వలయు నేర్పాటులు గావించెను. బుద్ధభగవానుని యమృత వాక్యములు శిలాశాసనములుగ జెక్కించి దేశమందంతటను నెలకొల్పెను. ఎన్ని యోస్తూపములను స్థాపించెను. సామాన్యజను లిట్టి శిలాశాసనములను బఠించి సద్వర్తను లగుదురని అశోకుని విశ్వాసము. దీనికితోడు మత ప్రచారకుల నెందఱనో పట్టణములకును, పల్లెలకును బంపి మతబోధ గావించెను. అశోకుడు పాదచారియై స్వయముగ బౌద్ధ క్షేత్రములను దర్శించి, తీర్థయాత్రావశ్యకతను వెల్లడించెను. దక్షిణమున నున్న సింహళమునకు, పశ్చిమమున నున్న మహారాష్ట్రమునకు, ఉత్తరముననున్న టిబెట్టునకు, సముద్రాంతరముననున్న సుమిత్రా, జావా, చీనాదేశములకు అశోకుని ప్రతినిధులు బౌద్ధ ధర్మదేవతను కొనిపోయి ప్రతిష్ఠించిరి.

అశోకుని యౌదార్యమున జరిగిన బౌద్ధమతవ్యాప్తి వర్ణనాతీతము. అశోకుని పాలనా నైపుణ్యమును, ప్రతిభా విశేష

మును స్వయముగ గాంచగోరి, ఫాహియాన్, హియాన్‌సంగ్
అను నిరువురు చీనా యాత్రికులు పాటలీ పుత్రమును దర్శించిరి.
వినికిడి వలన దెలిసికొన్న అశోకుని వృత్తాంతములన్నియు యథా
ర్థములే యని వారు పరమానందము జెందిరి. వానిని బురస్క
రించుకొని వారు అశోకుని గూర్చి లిఖించిన వ్రాతలు నేటికిని
ఆదర్శప్రాయకములు, ఆహ్లాదకరములు.

స్వశక్తి చేతను, సుగుణముల చేతను, పరోపకారపర
త్వము చేతను, భక్తిమార్గము చేతను జీవితమును పావన మొన
ర్చుకొని భారత చరిత్రయందు శాశ్వత కీర్తి గాంచిన అశోకచక్ర
వర్తి పుణ్య పురుషుడు, సంస్తవనీయుడు, చిరస్మరణీయుడు. నేటి
కిని మన దేశపాలనమున ఆదర్శరత్నమై యున్నవాడు.

## మూడవ కథ 1 ఉపగుప్తుడు

పూర్వమొకానొకప్పుడు భారతదేశమున బౌద్ధమతము
విజృంభించి యుండెను. ఎచ్చట జూచినను బౌద్ధస్తూపములే;
శిలాశాసనములే; విహారములే; బౌద్ధబిక్షువులే; వేయికంఠముల
నుండి వెలువడినటుల బుద్ధవాణి దేశముయొక్క మూరుమూలల
ప్రతిధ్వనించి జ్ఞానసందేశమును వ్యాపింపజేసెను.

రాజ్యవైభవములన్నింటిని విడనాడి, వైరాగ్యసా
మ్రాజ్యమున కధిపతియై — "అహింసాపరమోధర్మః" యను
దివ్యజ్ఞానమును ప్రసాదించిన శ్రీ బుద్ధభగవానుని ముఖ్య
శిష్యులలో ఉపగుప్తుడు ఒకడు.

ఉపగుప్తుడు ఉత్తమ వంశమునకు జెందినవాడు; యౌవ
నుడు; సుందరాకారుడు. ఐనను బుద్ధుని సందేశము నాలకించి,

బౌద్ధభిక్షువై బ్రహ్మచర్యవ్రతమున నాశ్రమజీవితమును గడుపు చుండెను. మధురానగరము నందలి బౌద్ధవిహారము వాని కేంద్రస్థానము. అచ్చటి బౌద్ధసన్న్యాసులతో గూడి అహింసా ధర్మమును, బౌద్ధమత నియమములను ప్రచారము చేయుచు కాలము పుచ్చుచుండెను.

ఒకనాటి వెన్నెలరేయి ఉపగుప్తుడు మందిరము వెలుపలనున్న తోటలో నిద్రాగతుడైయుండ, కాళ్ళగజ్జెల చప్పుడు వినెను. ఊరి వెలుపలనున్న బౌద్ధవిహారములోనికి నర్ధరాత్రమున నెవ్వరు వత్తురాయని కొంతవడి సందేహించెను. తిరిగి యాశబ్దము వినరాకుండుటచే, భ్రమయని యెంచి నిద్రించెను. మరికొంతసేపటి కెవరో పూలదండ నొకదానిని దన మెడయందు నలంకరించుట తెలిసికొని కనులువిప్పి చూచెను. సౌందర్య రాశియగు నొక వధూటి విలువగలిగిన భూషణాంబరములు దాల్చి చెంతనే యుండెను. ఉపగుప్తుడు ఉలికిపడి, "సోదరీ, ఎవ్వతె వీవు? ఎక్కడనుండి రాక? ఎందులకు?" అని ప్రశ్నించెను.

ఆ వన్నెలాడియు ప్రేమావేశమును బట్టజాలక "ఉప గుప్తా, నిన్నుగూర్చియు, నీ విజ్ఞాన వైభవమునుగూర్చియు నీ రూపసౌందర్యమునుగూర్చియు విని యెంతకాలమునుండియో నిన్ను జేర మనస్సు కల్గియున్నదానను. ప్రేమకు లోనై నీదర్శన భాగ్యమును బొందినందులకు నన్ను మన్నింపుము. నీ రూప మును నాడెందమున నిల్పుకొని యెంతకాలమునుండియో వేచియున్నాను. దయాళుడవై నాకోరికను దెలిసికొని నన్ను

నిరాకరింపక గ్రహింపుము. వాసవదత్త యను వారాంగనను నేను" అనెను.

నిర్మలమగు నీలాకాశమునుండి పిడుగుపడినట్లయ్యెను. ఉపగుప్తునకు ఎల్లప్పుడును పవిత్రవాక్యములు వినుట కలవడిన వాని చెవులకు వాసవదత్తవాక్కులు కఠోరములయ్యెను. ఒక్క త్రుటిలో నామెయొక్క యుద్దేశము ఉపగుప్తుడు గ్రహించెను. అయినను దృఢమనస్కుడగు నాతడు కలతచెందలేదు; అలుక గాంచలేదు. రెండునిమిషము లూరకుండి ఉపగుప్తుడు ఇట్లనెను.

"సోదరీ, యౌవనోన్మాదముచే నీ విట్లు పలికితివి. ఏమి కోరి వచ్చితివో నీవు తెలియకున్నావు. శాక్యసింహుని పాద చిహ్నములచేపవిత్రమైన విహారమున నిలిచియీ యిట్లు పలుకుట! జీవితరహస్యము నీకు తెలియలేదు. ఈయౌవనము శాశ్వతమా? ఎల్లశరీరధారులకును మృత్యువు నిత్యము. ఇవి యెవ్వియును మరణకాలమున తోడైరావు. నీ రూపురేఖావిలాసములును, నీ భాగ్యభోగ్యములు స్థిరములుకావు. జీవుని పవిత్రవర్తనమే యండయై నిలచియుండును. కావున బౌద్ధమతధర్మమందలి యథార్థమును గ్రహించి, నీవు నీ తుచ్ఛవాంఛను వీడి, పావన మగు జీవనమును సాగింపుము. సత్యము నెఱుంగక జను లెందరో అజ్ఞానాంధకారమున మునిగియున్నారు. వారికి జ్ఞానదీపికను జూపుట మనకు విధియై యున్నది. కావున నీ వికారజీవితమును విడిచి, మానవసేవయందు కోరికగలదానవై ధన్యతను జెందుము" అని బుద్ధదేవుని నామము స్మరించెను.

ఉపగుప్తుని హృదయము వాసవదత్తకు గోచరమయ్యెను వాని మనస్సు మరల్చుట దుర్లభమని తెలిసికొనెను. ఉన్మాదిని యగు వాసవదత్తకు ఉపగుప్తుని వైరాగ్యవిషయ మెట్లు రుచించును? ఆమె వానియెడ నాగ్రహముచెంది నిందించుచు వెడలి పోయెను.

## 3

కొన్ని సంవత్సరములు గడచెను. బౌద్ధమత ప్రచారము నందును, మానవసేవయందును ఉపగుప్తుడు కాలముఁబుచ్చుచుండెను ఒకనాడు ఉపగుప్తుడు మధురానగరవీధుల బోవుచుండెను. మూలనున్న కుటీరమునుండి వచ్చుచున్న యార్తనాదమును విని యటకు బోయి యాతడు బహు విషరోగములకు లోనై శుష్కించియున్న శరీరముతో మృత్యుముఖమున బడెడు వాసవదత్తను గాంచెను. ఆమె 'దాహము, దాహ'మని యఱచుచు, గన్నులు తెఱచుటకైన నోపికలేని స్థితియందుండెను. ఉపగుప్తుడు కనికరించి తనకమండలములోని పావనజలముతో నామె నాలుకను దడిపెను. ఆయుపకార మొనర్చువారెవ్వరో గ్రహింపజాలక యామె ప్రశ్నించెను. "సాయము చేయుమని నీవుకోరిన ఉపగుప్తుడను" అని యాతడు తెలియబఱచుసరికి, వాసవదత్త మిగులనానందపడి "పుణ్యపురుషా, నాటినడురేయి విహారమున దెలియబఱచిన నీ సందేశసత్యమును గ్రహింపనైతిని. నాది తుచ్ఛజీవితము. అల్పభోగములకై స్త్రీత్వమును గోల్పోతిని. అధమాధమురాలను. ఈ యవసాన కాలమునందు

దిక్కులేని నాకు నీవే దిక్కు. నాజన్మ తరించినది. నీకెన్నటికిని నేను కృతజ్ఞురాలను" అని శాశ్వత సుషుప్తిని గాంచెను.

అవసాన కాలమందు వాసవదత్త నోటినుండి వెలువడిన వాక్యములకు సంతసించి, ఉపగుప్తుడు తన యాశ్రమమునకు మరలి పోయెను. తన పవిత్రజీవితముచే బౌద్ధ మతమునకు మెఱుగుబెట్టిన ఉపగుప్తుడు పుణ్యపురుషులలో నగ్రగణ్యుడు, ఆదర్శజీవి.

## నాల్గవకథ 1 జయదేవుడు

పూర్వము జయదేవుడు అనునొక బ్రాహ్మణశ్రేష్ఠుడుండెను. పూరీజగన్నాథ పుణ్యక్షేత్రమునకు కొద్దిదూరముననే యున్న బిందుబిల్వము ఈతని నివాసగ్రామము. పూర్వాచార పరాయణులును, సచ్చరిత్రులును నగు జననీజనకులచే జయదేవుడు గారాబముతో పెంచబడుచుండెను. ఆతడును విద్యయందాసక్తియు, పెద్దలయెడల విధేయతయు, దేవునియందు భక్తియు గలిగి యుండెను. తండ్రియొద్ద నేర్చుకొన్న విద్యాఫలితముగ జయదేవుడు పిన్నవయస్సుననే కవితాశక్తి నలవఱచుకొని 'గీతగోవిందము' అను మహాగ్రంథమును రచించెను. ఈశ్వరానుగ్రహమున లభించిన విజ్ఞానముతో రచింపబడిన 'గీతగోవిందము' భక్తిరసపూరితమై జనుల హృదయముల నాకర్షించెను. అచిరకాలములోనే 'గీతగోవిందము' ప్రార్థనా గ్రంథములలో నొక్కటి యయ్యెను.

ఆ విధముగ జయదేవుని పేరుప్రతిష్ఠలు నలుగడల వ్యాపించెను. ఆ వార్త నాకాలమున జగన్నాథపురము నేలుచున్న సాత్యకిరాజుకుకూడ వినవచ్చెను. జయదేవుని గీతములు దేవాలయములందు అర్చకులచేగూడ నుచ్చరింపబడుచున్నవని యాతడాశ్చర్యమొందెను. వెంటనే యీర్ష్యాపరుడయ్యెను. అందుచేత దానుకూడ ప్రార్థన గీతావళి నొకదానిని వ్రాసి, పూజారులను పిలిచి, జయదేవుని గీతములకు బదులు తాను వ్రాసిన వానిని నుపయోగింపుడని యాజ్ఞాపించెను. అందులకు వారొకింత సంశయమును వెల్లడించిరి. అప్పుడు సాత్యకి "ఆర్యులారా, పోనీ యొకపని చేసెదను. జయదేవుని గ్రంథమును, నా గ్రంథమును దేవుని పాదములకడబెట్టి యెద్దాని నాయన స్వీకరించునో దానినే స్వీకరింతము" అనెను. అందులకువారంగీకరించిరి.

ఆ సాయంకాలమే రెండు గ్రంథములును దేవాలయమునకు గొనిపోబడి గర్భాలయమున విగ్రహ సాన్నిధ్యమున నర్పింపబడినవి. అంత వారు తలుపులు మూసి వెలుపలికి వచ్చిరి. కొంత తడవునకు లోన శబ్దము వినరాగా వారందఱును తలపులు తెఱచి చూచిరి. సాత్యకియొక్క గ్రంథము నేలపై దూరముగ త్రోసివేయబడియుండెను. సాత్యకి సిగ్గుచే దలవంచుకొని జయదేవుడే యుత్తమ భక్తశిఖామణి యని యంగీకరించి వాని శుశ్రూష చేయబూనుకొనెను. రాజాదరణకు జయదేవుడెట్టి గర్వమును జెందలేదు. ఎప్పటియట్ల కాలము గడుపుచుండెను. జయదేవుని కీర్తి యానాటి కానాడు నలుదెసల వ్యాపింపజొచ్చెను.

## 2

జగన్నాథపురి యందు నివసించుచున్న యొకానొక ధనికుడగు బ్రాహ్మణునికి పద్మావతియను ముద్దు కొమార్తె యుండెను. పేరునకు తగిన సద్గ్రామె యందచందములకే కాక, గుణవిశేషములకు కూడ పేరుగాంచి యెల్లరకు నానంద మొనగూర్చుచుండెను. ఈమెకూడా బాల్యమునుండియు భక్తురాలై దైవధ్యానమునందే కాలము పుచ్చుచుండెను. ఆమె నిశ్చలభక్తికి తండ్రి సంతసించి యామె భక్తురాలుగనే జీవనము సాగించుట కంగీకరించెను.

ఒకానొక నాడు దేవుడు ఆబ్రాహ్మణునకు స్వప్నము నందు సాక్షాత్కరించి "నీ కొమార్తెను జయదేవునకిచ్చి వివాహముగావింపుము. వారి యనుకూల దాంపత్యముచే నా మహిమా విశేషములు మిక్కిలి వెల్లడికాగలవు"అని చెప్పెను. ఆ ప్రకారముగ బ్రాహ్మణుడు బయలుదేరి వెళ్లి, జయదేవుని కలిసికొని జరిగిన వృత్తాంతమును వివరించెను. ఈశ్వర కటాక్షమునకు జయదేవుడు సంతసించి వివాహము నకు వల్లెయనెను. శుభముహూర్తమున పద్మావతీ జయదేవులు భార్యాభర్తలైరి.

ఈ వివాహముచే పద్మావతి-జయదేవులు ఒకరిజీవితమున కొకరు మెఱుగుపెట్టిరి. భగవద్భక్తియందు వా రొకరికొకరు తీసిపోమెడివారుకారు. శ్రీకృష్ణుడు వారి యభిమానదైవము. ఆ రాధామనోహరునకీ పుణ్యదంపతు లొక పూజామందిరము నిర్మించి యచ్చటనే నివాసమేర్పఱచుకొని ప్రార్థనలతోడను,

పూజావిధులతోడను, పుణ్యకార్యములతోడను జీవితమును పునీతము గావించుకొనుచుండిరి. వారి పరిచర్యచే తమ జీవిత మును పవిత్రముజేసికొనుట కెందరో ప్రజలు వచ్చి వారిని దర్శించి ధన్యులగుచుండిరి.

పద్మావతీజయదేవులయొక్క హరికథా కాలక్షేపము లెక్కుడుగ ప్రశస్తిగాంచెను. పద్మావతీదేవి శ్రుతివేయుచుండ జయదేవుడు యొడలుమఱచి తనశ్లోకములను, అష్టపదులను గానముచేయుచుండెడివాడు. శ్రోతలు పరమానంద భరితు లగు చుండెడివారు.

ఈ యుదంతమును విని యొక పౌరుగూరి వర్తకు డొక మా రాదంపతులను తన గ్రామమునకు హరికథాకాలక్షేపమున కాహ్వానించెను. అందుల కంగీకరించి దంపతు లచ్చటికి జని జనుల మానసములను నూతనభావములతో పల్లవింపజేసిరి. భక్తి వినయపూర్వకముగ నావర్తకుడును జయదేవున కెన్నియో విలువగల బహుమతుల నిచ్చి పంపెను.

వా రా సాయంతనమే స్వగ్రామమునకు తిరిగివచ్చు చుండ మార్గమధ్యమున నున్న యడవియందు దుర్మార్గులగు చోరు లడ్డముతగిలిరి. పద్మావతీ జయదేవులను బంధించి, సొత్తు నపహరించి వారిని పాడునూతియందు పాఱవైచిరి. అట్టి ఘోరము జరిగినను వారు కంపముజెందక, అంతయు భగవంతుని మహిమయేయని తలంచి, ఈశ్వరనామసంకీర్తనము నందే చిత్తము చేర్చియుండిరి.

ఆ సమయముననే అటు పోవుచున్న సాత్యకిరాజు ఎచ్చట నుండియో అవ్యక్తమగు మధురగానము వినవచ్చుటచే నాగి శబ్దము వచ్చెడి స్థలమునకు బోయి యాపదయందున్న నా పుణ్య దంపతులను గాంచెను. వెంటనే యనుచరులచే వారిని వెలికి దీయించి, బంధవిముక్తులుగ జేసి, గాయములకు చికిత్సచేయిం చెను. వారిని తన రాజభవనమునకు గొంపోయెను.

రాజు భార్యయు ఆ పుణ్యదంపతులరాకచే నానందము నొందెను. రాజమందిరమునందే యా భక్తులకు వేఱుశాల లొసంగబడెను. వారిసేవకై ప్రత్యేకముగ పరిచారకు లేర్పాటు గావింపబడిరి. రాజదంపతులును, పద్మావతీజయదేవులకు స్వయముగ సేవ యొనరించుచుండిరి.

జయదేవుడు తన నిర్మలజీవనముచేతను, నిశ్చలభక్తి చేతను, రాజదంపతులనే కాక రాజ్యమునందలి జనుల నందఱను ఈశ్వరధ్యాన తత్పరులుగ నొనరించుచుండెను. వాని పుణ్య ప్రభావముచే నాస్థలమంతయు సౌఖ్యదాయకమయ్యెను.

జయదేవుడు 'గీతగోవిందము'నే కాక, 'చంద్రాలోకము,' 'కారకవాదము,' 'తత్త్వ చింతామణి' యను నుద్గ్రంథములను గూడ రచించెను. సంగీతసాహిత్య సంపదచేతనే కాక అసామాన్యమగు భగవద్భక్తిచే గూడ వన్నెగాంచిన జయదేవుని పవిత్రజీవిత మంతయు ధన్యతమమైనది. ఆదర్శప్రాయమైనది.

## అయిదవకథ 1 తులసీదాసు

అక్బరు మొగలాయి సామ్రాజ్యమున కధిపతియైయున్న కాలమున హస్తినాపురమందు ఆత్మారామ్ అను బ్రాహ్మణ ప్రముఖు డొక డుండెను. అతడు భాగ్యవంతుడు. అక్బరుపాదుషాకు మిత్రుడు. అతనికి తులసీదాసు అను కొమారుడుండెను. సంపన్న కుటుంబమునకు జెందినవాడగుటచే, తులసీదాసు సర్వసౌఖ్యముల ననుభవించుచుండెను. అక్బరుచక్రవర్తికూడ వానిని లాలించెడివాడు.

శ్రోత్రియవంశమునకు జెందియుండుటచే తులసీదాసునకు పదునాల్గవయేటనే వివాహమయ్యెను. మాతాదేవి యను సుందరి యాతనికి భార్యగా లభించెను. కొమారునియొక్కయు కోడలియొక్కయు ఐహికానందమునకై ఆత్మారామ్ ఎంతయో ధనమును వెచ్చించి, శయ్యాగారములు, క్రీడారామములు మొదలగునవి తయారుచేయించెను. అందు మాతాదేవియు, తులసీదాసును నానందసాగరమున దేలియాడుచు కాలచక్రమును గమనింపక యుండిరి.

ఇట్లుండ నొకనాడు తులసీదాసు అక్బరుతోగూడ వేటకై యడవికి బోయెను. ఆ సమయమున మాతాదేవి యొక్క తల్లి జ్వరపీడితయై యుండెనన్నవార్త తెలియుటచే నామె యత్తమామలయొద్ద సెలవుగైకొని, భర్త యింట లేనందులకు విచారపడుచు స్వగ్రామమునకు బోయెను.

తులసీదాసు తిరిగివచ్చి, తనభార్య వెళ్ళిన సంగతి తెలిసికొని విచారము పొందసాగెను. పెండ్లియైనదిమొదలు వియోగ

మనునది యెఱుగక భార్యతోగూడ నానందసరసిలో దేలు చున్న యాత డామెవియోగమునకు ఖిన్నుడయ్యెను. ఆ దిన మంతయు పిచ్చివానివలె గన్పట్టెను. రాత్రి యాతనికి నిద్దుర పట్టలేదు. అంత నాత డెవ్వరికిని జెప్పక అర్ధరాత్రమున నిల్లువిడిచి యడవిదారులందు నొంటిగ భార్యయొద్దకు ప్రయాణమయ్యెను.

కొంతసేపటి కాత డామెగృహముచేరుకొని తలుపు తట్టెను. కాని నిద్రావస్థయం దుండుటచే నెవ్వరును పలుకరైరి. తుద కాత డింటిగోడను దాటి లోనికి బోయెను.

## 2

ఒక గదియందు మాతాదేవి నిద్రించుచుండెను. తులసీ దాసామె చెంతకుజేరి పిలిచెను. మాతాదేవి కలవరపడి లేచి నిశ్చేష్టిత యయ్యెను. 'నీ వుంచిన రజ్జువుయొక్క సహాయమున గోడదాటితి' నని చెప్పిన పతివాక్కునకు మాతాదేవి భయ పడెను. వెంటనే యామె గోడయొద్దకు దీపమునుగొనిపోయి చూచెను. అచ్చట వ్రేలాడుచున్నది త్రాడుగాదు, పెద్ద విష సర్పము. ఆమె భయమునకు మేరలేకపోయెను. తులసీదాసున కెట్టి హానియు కలుగనందులకు ఈశ్వరునికి కృతజ్ఞతదెల్పి కొంత ధైర్యము దెచ్చుకొని భర్తతో నామె యిట్లనెను. "నాథా, ఎందుల కిట్టి తొందఱపని చేసితిరి? మీ తల్లిదండ్రులు తెలిసి కొన్న నేమందురు? దేహము లనిత్యము లని తెలియదా? బుద్బుదములవంటి యీయిహలోకసౌఖ్యములకై యింతగా బ్రాకు లాడనేల? సర్వమును దెలిసిన మీకు వేఱుగ జెప్పవలయునా?

కఠినముగ మాట్లాడుచుంటినని కినియకుము. విధిగాన జెప్పుచుంటిని.''

తులసీదాసు నిర్విణ్ణుడై నిలిచెను. భార్య యిట్టి భావములను దెల్పుట కదియే మొదటి పర్యాయము. ఏద్దియో నూతన శక్తి, నూతనవికాసము వానియందు బ్రవేశించెను. మాతాదేవి తెల్పిన వాక్యములయందలి యథార్థము వానికి సుబోధకమయ్యెను. వెంటనే యాతడు దివ్యజ్ఞానోపదేశ మొసర్చిన భార్యకు నమస్కృతు లొనర్చి యచ్చటినుండి మరలిపోయెను.

అదియే తులసీదాసు జీవితమున నూతనాధ్యాయము. భార్యను విడిచి యాత డడవియందే నివాస మేర్పఱచుకొనెను. పక్షులును వృక్షములును వానికి బంధువు లయ్యెను. భూదేవియే శయ్యాతలమయ్యెను. కందమూలములే భోజ్యము లయ్యెను. సెలయేటి జలములే పానీయము లయ్యెను. భగవద్ధ్యానమే ముఖ్య కర్తవ్య మయ్యెను. ఆవిధముగ తులసీదాసు జ్ఞాన సముపార్జనము చేయదొడంగెను.

## 3

ఒకనాడు తులసీదాసు అడవియందు వృక్షచ్ఛాయను వృద్ధబ్రాహ్మణబ్రహ్మచారిరూపమున దపము చేయుచున్న యాంజనేయుని గాంచెను. వానిచెంతకు బోయి ''శ్రీరాముని దర్శనభాగ్యము గలుగజేయుము'' అని వినయముతో వేడుకొనెను. తులసీదాసుయొక్క నిర్మల హృదయమునకు మారుతి మెచ్చుకొని తన తపఃప్రభావమున వానికి సీతారాముల దర్శన

భాగ్యము కలుగజేసెను. తులసీదాసు పరమానంద భరితు డయ్యెను. తర్వాత హనుమంతుడు తులసీదాసును గాంచి "భక్తవరా, నీ సాధన సంపత్తి గొప్పది. ఈశ్వర దర్శనముచే పరిపూర్ణుడవైతివి. నీవంటి పుణ్యపురుషుడే యరణ్యోపదేశముల వృథా కాలక్షేపము చేయక లోకోపకారముచేయుట సమంజసము. కావున నిచ్చోటు వీడి, దేశసంచారము గావించి, ప్రజలయందు శ్రీరామభక్తి ప్రభావము పురిగొల్పుము. ఈశ్వర సందేశము నీవలన సర్వతోముఖముగ వ్యాపింపగలదు" అనెను.

అందులకు తులసీదాసు అంగీకరించి, యా తపోవనమును వీడి, పుణ్యక్షేత్రమగు కాశీయందు నివసింపబోయెను. వారణాసియందు తులసీదాసు ప్రతిభ జగద్విదిత మయ్యెను. ఎందఱో సాధువులు, భక్తులు, వారు వీరననేల, పెక్కండ్రు తులసీదాసు కడ రామనామ మహిమను దెలిసికొని ధన్యాత్ములైరి. గొప్పవారు సహితము వారి శిష్యులైరి. తులసీదాసు రామాలయ మొకదానిని నిర్మించి యందు హితోపదేశములు చేయుచుండెను. పెక్కుకానుకలు వాని కర్పింపబడెను. వాని నన్నింటిని తులసీదాసు దేవునికే యుపయోగ పఱచుచుండెను.

తులసీదాసు కాశీ యం దున్నాడని విని భార్యయగు మాతాదేవియు, జననీ జనకులును నచ్చటి కేగిరి. సమస్త సౌఖ్యములను వర్జించి ధన్యాత్ముడైన యాతని హితోపదేశమును బొంది వారుకూడ ధన్యులైరి.

అక్బరుపాదుషాకూడ తులసీదాసు కీర్తిని విని వానిని దర్శించి, ఢిల్లీకి గొంపోయి గౌరవించెను. ఆమతసహాస్యము ఆదర్శప్రాయమై వెలయుగాత ! అటుపిమ్మట తులసీదాసు రామాయణమును రచింపబూనెను. ఆ గ్రంథసంపూర్తితో వాని జీవితముకూడ ముగిసెను.

"తులసీదాసు రామాయణము" నేటికిని గ్రంథరాజములలో మిన్నయై యలరారుచున్నది. అట్టి పుణ్యగ్రంథమును వ్రాసి నిర్మలమగు రామభక్తిని దేశమున ప్రదర్శించిన తులసీదాసు పుణ్యపురుషులలో మేటి.

ఆ ర వ క థ 1 వే మ న

పూర్వమొకానొకప్పుడు ఆంధ్రదేశమునకు రెడ్డిరాజులు ప్రభువులై యుండిరి. కొండవీడు పట్టణమును రాజధానిగ జేసికొని రెడ్డిరాజులు చాలకాలము మహోన్నతదశ యనుభవించిరి.

ఆ రెడ్లవంశమునకు జెందినవాడే వేమన. ఈతని పుట్టుకను గూర్చియు, తల్లిదండ్రులను గూర్చియు రెండుగాథలు గలవు. ఒకానొకప్పుడు కొండవీడు నేలిన కోమటి వేమారెడ్డికి వేమన రెండవకుమారు డందురు. మఱికొందఱు వేమన మాచర్ల-పురమునందు వెలసిన చెన్నకేశవస్వామి ప్రసాదమున లక్ష్మాంబ-తుంగకేశవులకు జనించెనందురు. ఈ రెండవయుదంతము యథార్థమని నమ్మదగును.

వేమన క్రీస్తుశకము 15 వ శతాబ్దారంభమున జనన మొందెను. నందననామ సంవత్సర కార్తికశుద్ధ పూర్ణిమ వాని

జన్మదినము. సద్గుణసంపన్నులును, ఈశ్వరభక్తులును నగు జననీ జనకులకు ప్రాప్తమైన వేమన తదన్యుడెట్లగును? పిన్నవయస్సున నుండియు నాతడు తల్లిదండ్రుల వర్తనమును గమనించి వారి వలెనే నడచుకొనెడివాడు. భగవద్ధ్యానమునందు లీనమయ్యెడి వాడు. దానధర్మములను జేసి సంతసించెడివాడు. ఐహికభోగము లందు విముఖుడయ్యెడివాడు ఇట్టియోగ్యలక్షణములచే పెరిగిన వేమన గొప్పవాడయ్యెనన్న వింతకాదు.

దీని కంతకును దోడు తుంగకేశవుడు, కుమారునియొక్క విద్యాభ్యాసమునందును, ప్రవర్తనాది విషయములందును శ్రద్ధ వహించెడివాడు. తండ్రియొక్క బోధలను వినుటయేకాక వాని జీవితచర్యలను గమనించి వేమన ప్రవర్తించెడివాడు.

## 2

ఇవ్విధముగ చిన్ననాటనే వేమనయందు శక్తిబీజము నాటబడెను. పోనుపోను వానిమనస్సు లోకవ్యవహారములనుండి మరలి, ఈశ్వరచింతనమునందే లగ్నమయ్యెను. "శరీరసౌఖ్య ములు, క్షణికములు; భాగ్యభోగ్యములు అల్పప్రాయములు; పరనిందా పరస్పరద్వేషములు హానికరములు; భూతదయ, జ్ఞానప్రబోధము, భక్తి, విశ్వాసము–ఇవియేశాశ్వతములు." ఇట్టి సద్భావములే వేమనను బూర్తిగ నావహించెను.

వేమన రాజకులమున జన్మించినను సర్వసౌఖ్యములను, ఆడంబరములను వీడెను. తాను గ్రహించిన వేదాంత రహస్య ములను, జీవితధర్మములను ఉత్తమమార్గ విధానములను నంద ఱకును జాటుచు వేమన దేశమంతటను సంచారము చేసెను.

"దేవు డందఱకును నొక్కడే, దైవభక్తియే మోక్షదాయకము" అను సిద్ధాంతములను బ్రజలకు దెలియజెప్పెను.

వేమన పండితుడు కాడు. శ్రోతలను వశీకరణచేసికొను శక్తిగల్గిన వక్త కాడు. అయినను వానియం దొకమహిమ కలదు. అజ్ఞానులకు మనస్సు రంజింపచేసెడి విషయములను జెప్పెడివాడు. అదియునుగాక సామాన్యనీతులను, ధర్మములను, సులభశైలిని పద్యరూపమున నాశువుగ జెప్పెడివాడు. వేమనకు బూర్వము తెలుగు కవు లందఱును సంస్కృతభాషావేత్తలు. వారి రచనలు బహుజనాకర్షణీయములు కాకుండెను. అట్టి సమయమున సామాన్యభాషలో, అచ్చతెలుగుపదములతో, వేమన జనుల దృష్టిని ఏకసూత్రమున గట్టివైచెను. వేమనయొక్క బోధనామృతము దెల్పుపద్యము లెన్నియో యుండెను. అట్టివి వేనవేలని వాడుక. సుమతీశతకములో బాటు వేమనశతకముకూడ నాంధ్ర బాలికాబాలకుల జ్ఞానాభివృద్ధికి దోడ్పడును.

( ఈ క్రింది పద్యములను గమనింపుడు. )

"ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడజూడ రుచుల జాడవేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ వినురవేమ. 1

అన్నిదానములను నన్నదానముగొప్ప
కన్నతల్లి కంటె ఘనము లేదు
ఎన్నగురునికన్న నెక్కువ లేదయా
విశ్వదాభిరామ వినురవేమ. 2

అంతరంగమందు నపరాధములుచేసి
మంచివానివలెను మనుజుఁడుండు
ఇతరులెఱుఁగకున్న నీశ్వరుఁడెఱుఁగఁడా
విశ్వదాభిరామ వినురవేమ." 3

3

ఇట్టివే సామాన్యవిషయములను ఉత్తమనీతులను వేమన సుబోధకముగ రచియించెను. వానిని బ్రజలు త్వరితముగ నర్థము చేసికొని యనుసరించుటకు బ్రయత్నించిరి. వేమన పద్యముల మూలమున తెలుగుసీమకు జరిగిన మహోపకార మింతయంత యని చెప్ప నలవికాదు. అవి సామాన్యపద్యములు కావు. సానలదీరిన జాతిరత్నములు. మానవుని ఐహిక, సాంఘిక నైతిక జీవనమునకు ఉత్తేజము కల్గించు సాధనములు. ఇవి తమిళము, ఆంగ్లము మొదలగు నన్నిపరభాషలలోనికో యనువదింపబడి యానందము గొలుపుచున్నవి.

అజ్ఞానమునుండి ప్రజలను మేల్కొల్పుటయే ముఖ్యలక్ష్యణముగ బెట్టుకొని వేమన దేశసంచారముజేయుచుండ పలువురు వానిని పిచ్చివాడని గేలిచేసిరి. కాని వేమన తన ప్రచారమును విరమింపలేదు. వాని నమ్రతను, విశ్వాసమును, పరమభక్తిని గాంచి కొందఱు శిష్యులుగ జేరి వానికి సహాయ మొనర్చిరి. ఈ శిష్యబృందముతో వేమన మఱింత విజృంభించెను. "అనృత మాడరాదు, చోరత్వము తగదు, కామక్రోధమదమాత్సర్య ములు కూడవు, భూతదయ యవసరము, ధర్మమే జయము, కాయ మనిత్యము, దైవస్మరణయే భక్తిముక్తిదాయకము" అను వేమనసందేశము నలుదిక్కుల వ్యాపించెను.

ఈ విధముగ తన జీవితమును ధర్మమునకును, మతము నకును, దేశమునకును, భక్తికిని ధారబోసి క్రీస్తుశకము 1480 శార్వరిసంవత్సర చైత్రశుద్ధ నవమినాడు వేమన పరమపదించెను. అమ్మహనీయుని స్మారకచిహ్నముగ వాని శిష్యబృందము కటారుగ్రామమునందు మఠమును స్థాపించిరి. ఈ ప్రాంతమున నేటికిని ఏటేటను 'వేమనజయంతి' మహావైభవముతో జరుప బడుచుండును.

వేమనవలె కవితాసాహిత్యరూపమున ధర్మప్రబోధము గావించి ఖ్యాతిగాంచిన యాంధ్రకవు లరుదు. అందుచేతనే తెలుగుసాహితీవర్గమునందె గాక మతప్రవక్తలలోగూడ వేమన వన్నెగాంచి పురుషులందు పుణ్యపురుషుడై వేఱుగ వెలయు చున్నాడు.

## ఏడవకథ: 1 గురునానక్

హిందూదేశమునకు నుత్తరభాగమున పంజాబుదేశ మున్నది. ఈ పంజాబురాష్ట్రమున నున్న 'తాల్వెండి' అను గ్రామమున 1469 సంవత్సరమున నానక్ మహా యను నాతడు జన్మించెను. ఆతని తల్లిపేరు 'త్రిప్త', తండ్రి 'కాళుడు'.

నానక్ చిన్నతనమునందు జూపిన యఖండ విద్యా బుద్ధులను గూర్చి యనేక గాథలు కలవు. విజ్ఞానవేత్తలుకూడ నానక్ సందేహములను దీర్చుటకుగాని, ప్రశ్నలకు సమా ధానము చెప్పుటకుగాని యసమర్థు లగుచుండెడివారట.

నానక్ పాఠశాలయందు విద్య గఱచుచుండగా 'మీాకే మియు తెలియదు' అని ఉపాధ్యాయులతో బోరాడి యచ్చటికి బోవుట మానెను. అప్పటినుండియు నాతడు మతవేత్తలు, సాధులు మొదలైనవారిచెంత జేరి తత్త్వజ్ఞాన విషయములను దెలిసికొన ప్రారంభించెను. ఇట్లుండ నానక్ తండ్రి చూనీదేవి యను బాలిక నిచ్చి యతనికి వివాహము గావించెను.

సంసారము మొదలిడినతర్వాత దైవేచ్ఛచే నానక్‌నకు ఇరువురు కుమారులు కలిగిరి. కాని నానక్ ఏ విషయమునను జోక్యము కలిగించుకొనక తన ధోరణియే తనదిగ దలంచి చరించుచుండెను. కాళుడు అది చూచి సహింపలేక, కుమారు నెట్లైన సంపాదనాపరునిగ జేయవలెనని తలంచి, నానక్‌ను వర్తక వ్యాపారమున బ్రవేశపెట్టనెంచెను. ఆ యుద్దేశముతో నొక మారు కాళుడు నానక్‌నకు కొంతద్రవ్య మిచ్చి సమీాపపట్టణము నకు బోయి కొన్ని సరకులను దెమ్మనెను. నానక్ తండ్రి యాజ్ఞానుసారము పోవుచు మార్గమధ్యను క్షుద్బాధాపీడితులైన కొందఱు భిక్షుకులను గలిసికొని, వారికై యా సొమ్ము నంతయు వ్యయపఱచెను. రిక్తహస్తములతో దిరిగివచ్చిన నానక్‌ను జూచి కాళుడు కఠినముగ నిందించెను. ప్రత్యుత్తర మీాయక నానక్ యిల్లు విడిచి వెడలెను.

## 2

అదియే నానక్ జీవితములో నూతన వికాసము. సంసారముపైనను, సంఘముపైనను నాతనికి రోతకలిగెను. అంత నాతడు సన్న్యాసియై సంచరించుటకు తీర్మానించుకొనెను. వానితో గూడ

మర్దనుడు అను మహామ్మదీయగాయకు డుండెను. ఇరువురును గలిసి ఫకీరులు గ దేశాటనము ప్రారంభించిరి.

కబీరువలెనే నానక్ గూడ మహామ్మదీయ మతసిద్ధాంతముల నాదరించెను. వానివలన గొంతమార్పు కల్గెను. కాని యాతడు మహామ్మదీయమతమును మాత్రము స్వీకరింప లేదు. దేవు డొక్కడేయను సిద్ధాంతము నాతడు సూత్రీకరించెను. "మతము లెన్నియైనను, వానిపే ళ్ళెన్నియైనను నందఱకును దేవు డొక్కడే. అన్నిమతములయొక్క లక్ష్యమును నొక్కటియే. సర్వసౌఖ్యదాయియగు నీశ్వరుని భక్తియే మానవజీవితమును తరింపజేయగల్గినది. భగవంతుని నామోచ్చారణచేతనే సంసార బంధములు వీడును. సత్యమయుడైన పరమాత్ముడే శాశ్వతము" అని నానక్ బోధింప దొడగెను.

ఆడంబరమన్న నానక్‌నకు గిట్టదు. హిందువుల విగ్రహారాధనపు పద్ధతి నాతడు తీవ్రముగ ఖండించెను. బృందావనము, మధుర, జగన్నాధము, మొదలగు పుణ్యక్షేత్రములందు మతము పేరిట గావింపబడుచున్న యత్యాచారముల నాతడు తూర్పార బట్టెను. ఈ విధముగ నాతడు మూఢమతాచారములను నిందించుచు, దైవబోధగావించుచు, హిందూదేశమంతటను సింహళమునను, ఆఫ్గనిస్థానమున నెల్లెడలను దిరిగెను. తుదకు వానికి మక్కాకు బోవలె ననెడి సంకల్పము గలిగెను. హిందువైనవా డట్టి కార్యముచేయుట నా కాలమున ఘోరముగ నెంచబడెను. కాని నానక్ వెనుకంజ వేయలేదు ఫకీరువేష

మును దాల్చి గాయకమిత్రుడగు మర్దనునితో గూడ మక్కాకు బయన మయ్యెను.

అచ్చటి దేశపు కట్టుబాటులను, మతాచారములను సరిగ దెలియనందున నానక్ అనేక కష్టనిష్ఠురములకు లోను గాపలసివచ్చెను. కాని నానక్ యొక్క యుపదేశవాక్యములను వా రాలకించి యుత్సాహపూరితులైరి. పిమ్మట నానక్ తన స్నేహితునితో గూడ మదీనా, బాగ్దాదు మొదలగు పట్టణరాజములను దర్శించి, పంజాబునకు తిరిగివచ్చి కర్తారపురము అను చోట స్థావర మేర్పర్చుకొనెను.

కొంతకాలమునకు మర్దనుడు చనిపోయెను. అటుపైన నెంతకాలమో నానక్ జీవింపలేదు. చెంతజేరిన శిష్యగణమునకు దైవభక్తిమహిమదెల్పుచు, ధ్యానావశ్యకత నెఱిఁగించుచు, పరమేశ్వరసాన్నిధ్యమున కరుగు కాల మాసన్నమైనదని చెప్పి నానక్ తన జీవితము 1558 లో ముగించెను.

# 3

నానక్ యొక్క మృతకళేబర విషయమై సమస్యకలిగెను. హిందువులు దహనముచేయవలె ననిరి. మహమ్మదీయులు ఖననము చేయవలెననిరి. వారటుల వివాదము సల్పుచున్నసమయమునసే యాతని దివ్యమంగళవిగ్రహ మదృశ్యమయ్యెను.

నానక్ హిందువైనను ఏమతమును నాతడు బాటింపలేదు. దైవభక్తికి మతముతో బ్రసక్తిలేదని వాని నమ్మిక. ఈశ్వరచింత దప్ప మానవునికి ప్రత్యేక మతముతో నావశ్య

కత లేదని యాతడు బోధించెను. ఈ బోధ నాలకించి నానక్‌ను అనుసరించినవారికి 'సిక్కులు' అని పేరు. 'సిక్కు' అనగా 'దివ్య జ్ఞానధనుడు' అని యర్థము. ఇట్టి సిక్కులకు నానక్ ప్రథమ గురుడు. వీని తర్వాత నెందఱో మతగురువులు నానక్ బోధ లను విస్తరింపజేసి సిక్కుల సంఖ్యను వృద్ధిజేసిరి. నానక్ బోధ లన్నియు సేకరింపబడిన గ్రంథముపేరు 'గ్రంథసాహెబ్'. హిందు వులకు 'భగవద్గీత', మహమ్మదీయులకు 'ఖురాన్', క్రైస్తవులకు 'బైబిల్' ఎట్టివో, సిక్కులకు 'గ్రంథసాహెబ్' అట్టి ప్రమాణ గ్రంథము.

సిక్కులు నేటికిని పంజాబునందు ప్రముఖులై యున్నారు. నానక్ వారి మతగురువు. హిందూ సనాతనులు శంకరా చార్యుల నెట్లు గౌరవింతురో నానక్‌ను సిక్కు లట్లు గౌర వింతురు. హిందూదేశమునం దుద్భవించి, దైవభక్తికి కృషి సల్పి, శాశ్వతకీర్తిని గన్న పుణ్యపురుషులలో నానక్ ప్రశంస నీయుడు. భారతదేశము వర్ధిల్లు నంతకాలము, సింధునదీ తరంగములు మృదుగానము సల్పునంతకాలము, నానక్ నామము స్థిరత్వమును బొంది ప్రత్యేకముగ వైషమ్యములు ప్రబలుచున్నకాలమున నాదర్శరత్నమై విరాజిల్లు ననుటకు సందియము లేదు.



ఎనిమిదవ కథ 1 స్వామి దయానంద

పువ్వు పుట్టినతోడనే పరిమళించును. లోకవ్యవహారములుగాని, బాధలుగాని, భక్తి కాటంకములు కాజాలవు. సత్యమువలెనే యీశ్వరభక్తియు విజయముగాంచి పరమార్థత నొందును. ఈ సత్యము దయానందస్వామి జీవితమునందు నిరూపింపబడినది. సంఘసేవ, దైవభక్తి, దేశాభిమానము ఈ మూడును దయానందునియందు మిళితమై వానిజీవితమును ధన్యతమముగ నొనర్చినవి.

గుజరాత్ నందు 'మోర్వి'యను చిన్నపట్టణము కలదు. అందు అంబాశంకరుడు అను నొక బ్రాహ్మణ జమీందారుడు కలడు. ఆతడు గొప్ప మతాభిమాని. 1824 సంవత్సరములో వానికి మూల్ శంకర్ అను పుత్రుడు కల్గెను. హిందూ శాస్త్రవిహితముగ జీవితము సాగించుచున్న అంబాశంకరుడు కుమారునికి చిన్నతనమునుండియు సంస్కృతభాషను, మత విషయములను నేర్ప ప్రారంభించెను. అందుచే పదియవ సంవత్సరము నిండకపూర్వమే మూల్ శంకరుడు శివభక్తుడుగ పేర్గాంచెను.

ఈ లేత వయస్సుననే యొకానొకవిషయము మూల్ శంకరునియొక్క భక్తివిశ్వాసములను కదలించెను. ఆసంవత్సరము శివరాత్రిమహోత్సవము వచ్చెను. పగలంతయు అంబాశంకరుడును, భార్యయు, పుత్రుడును ఉపవాస ముండి రాత్రి జాగరము చేయ నిశ్చయించిరి. రాత్రి సమయమున నందఱును గలిసి శివ భజన సేయుచుండిరి. కాని కొంతసేపటికి మూల్ శంకరుడు తప్ప

తక్కిన వారందఱును నిద్రించిరి. అత డొంటరిగ గూర్చుండి, విగ్రహపూజ నొనర్చు చుండగచుంచెలుకలు వచ్చి శివలింగము పై యిష్టమువచ్చినట్లు పరువెత్తెను. విగ్రహమే నిజముగ శివ స్వరూపమైనచో నట్టి పరాభవచర్య దేవుడు సహించునా యని వానికి సంశయము పొడమెను. వెంటనే యాతడు తండ్రిని మేల్కొలిపి ప్రశ్నించెను. కాని వానిప్రత్యుత్తరము మూల్ శంకరునకు దృప్తికరముగ లేదు. అందుపై వాని యాలోచన తీవ్ర మయ్యెను మూఢవిగ్రహారాధనయొక్క ప్రయోజన మేమని యాతడు శంకింప జొచ్చెను.

ఇట్లుండగా మూల్శంకరునియొక్క సోదరియు, వాని మామయు విపరీతవ్యాధులకు లోనై యకాలమరణము జెందిరి. ఇవికూడ మూల్శంకరునియొక్క మనస్సును చలింపజేసెను. జీవితము బుద్బుదప్రాయముగదా! ఐహికాముష్మికసుఖ మెట్లు ప్రాప్తించును?- అనియే మూల్శంకరునకు ముఖ్య సమస్య యయ్యెను. వానియాత్మపరీక్ష తీవ్ర మయ్యెను.

కొంతకాలమున కాలోచనాపరంపర ముగిసెను. శాశ్వతానందమునకును, అమరత్వమునకును గూడ జ్ఞానమే మూల కారణమని నిశ్చయము చేసికొనెను. తండ్రియొద్దను, మఱి కొందఱు పాఠశాలాగురువుల యొద్దను విద్య నభ్యసింపమొదలిడి విషయములను తెలిసికొన ప్రారంభించెను. కాని యివియెవ్వియును వానికి దృప్తినీయలేదు.

ఇట్లుండ దండ్రి వానికి వివాహముచేయుట కాలోచించెను. మూల్శంకరున కది యిష్టము లేదు. గృహస్థాశ్రమమున బంధింపబడినచో తన యభీష్టము నెఱవేఱదని యాతడు గ్రహించెను. అందుచే నాత డొకనాటిరాత్రి యెవ్వరికిని దెలియకుండ నిల్లు విడిచి పాఱిపోయెను.

పోయిపోయి మూల్శంకరుడు శాయల యను గ్రామము జేరి, శుద్ధచైతన్యుడను యోగిపుంగవుని శరణుజొచ్చెను. ఆస్వామి మూల్శంకరునికి కాషాయాంబరముల నిచ్చి శిష్యునిగ జేసికొని, బోధ చేయుచుండెను. మూల్ శంకరుడును నాయాశ్రమ జీవితమున కలవడి, బైరాగులతోగూడ మైత్రి సంపాదించి, దేశాటనము మొదలిడెను. అట్లు గావించుచు నొక తూరి కార్తికోత్సవమునకు సిద్ధాపురమును జేరెను. ఆవార్త తెలిసికొని అంబాశంకరుడు అచ్చోటికేగి, కుమారుని దీసికొని పోయి యింట బందీకృతుని జేసెను.

కుమారు డట్లు వైరాగ్యపద్ధతి నవలంబించుట వానికిష్టము లేదు. సంఘటిల్లిన కష్టమునకు మూల్ శంకరుడు విచారపడుచు, తిరిగి పాఱిపోవుటకై సమయము నిరీక్షించుచుండెను. ఒకనాటిరాత్రి నౌకరు లందఱును నిద్రాగతులైయుండ మూల్శంకరుడు తిరిగి యింటనుండి పలాయితు డయ్యెను.

## 2.

అచ్చటినుండి బరోడా వెళ్లి వేదాంతపండితులయొద్ద తత్త్వశాస్త్రపఠనము గావించెను. తర్వాత మూల్శంకరుడు నర్మ

దానదీతీరమున నివాస మేర్పఱచుకొని తత్త్వసంపన్నులగు సన్న్యాసులను గలిసికొనెను. అచ్చటనే మూల్శంకరుడు పదు నెనిమిదిమాసము లుండి సర్వశాస్త్రరహస్యములను గ్రహించెను. అంతలో నక్కడికి పూర్ణానందసరస్వతి యను యతీశ్వరు డేతెంచెను. వానియనుగ్రహముచే మూల్శంకరుడు సన్న్యాసము స్వీకరించెను. అప్పటినుండియు పూర్ణానందుడు వానికి దయానంద సరస్వతి యని పే రిడెను.

అప్పటికి దయానందున కిరువదినాల్గు సంవత్సరములు మాత్రమే వయస్సు. పిమ్మట సుమారు పదిసంవత్సరము లాతడు యోగాభ్యాసమునందును, వేదపఠనమునందును, తీర్థయాత్రలందును గడిపెను.

తర్వాత దయానందుడు ఉత్తరహిందూస్థానమందు యమునానదీ తీరమున నున్న మధురానగరము చేరుకొనెను. పాంచాలదేశీయుడగు వ్రజానందస్వామి యచ్చట పీఠము నేర్పఱచుకొని యుండెను. ఆయన గ్రుడ్డివాడు. అయిననేమి? వానిపాండిత్య మపారము. అద్వితీయము. సమకాలపండితుల నందఱను మించిన సూక్ష్మజ్ఞాని. అట్టివానిశుశ్రూష దయానందుని పురోభివృద్ధికి కారణ మయ్యెను. కొన్నిసమయములందు వ్రజానందుడు కాఠిన్యమునుగూడ బూని, దయానందున కనేక వేదాంతవిషయములను బోధచేసెను. దయానందున కంతటి ప్రబోధము మున్ను కలిగియుండ లేదు. ఒక నూతనోత్సాహము, నూతన తేజస్సు వానిలో బ్రవేశించెను.

# 3

ఇట్లు కొంతకాలము గడచినపిదప విర్జానందుడు దయానందు నుద్దేశించి యిట్లనెను. "ఇచ్చట నీపని ముగిసినది. ముందుకర్తవ్యమును నెఱవేర్పుము. సర్వసుగుణములను, సర్వజ్ఞానమును సంపాదించితివి. ఇంతటినుండి లోకోద్ధరణకై నీసర్వశక్తులను వినియోగింపుము. హిందువులు తమ యధార్థ ధర్మమును మఱచి మూఢవిధానముల ననుసరించి యధోగతి పాలగుచున్నారు. పరమాత్ముని నిజస్వరూపమును మఱచి ఱాలను, రప్పలను నర్థవిహీనముగ పూజించుచున్నారు. అమూల్యములగు వేదాంతసందేశములను గ్రహింప లేకున్నారు. ఇట్టి యజ్ఞానమును పాఱద్రోలుటయే నీ ముఖ్యకర్తవ్యము. ఇది భారవహమైన కార్యము. కాని నీవంటి సంస్కారపురుషునకు నిది కష్టము కాదు. నీ మూలమున దేశమున గ్రొత్తవెల్గు ప్రకాశింపగలదు."

గురువుయొక్క యాజ్ఞను శిరసావహించి దయానందుడు మధురాపురమును వీడి యీశ్వరసందేశము నెల్లప్రాంతములను ప్రతిధ్వనింపజేయుటకై బయలుదేరెను. ఆగ్రా, గ్వాలియర్, జయపూరు, హరిద్వారము, వారణాసి, కలకత్తా, బొంబాయి, పునహా, అలహాబాదు, ఢిల్లీ, లూధియానా, లాహోరు మొదలగు పట్టణములను దయానందుడు దర్శించెను. తాను వెడలిన తావులలో నెల్ల మూఢ విగ్రహారాధనను ఖండించెను. వ్యర్థతీర్థయాత్రలను నిరసించెను. మతవైషమ్యములు కూడ

వనెను. బాల్య వివాహములను వలదనెను. వేదార్థమునందలి సత్యమును వెల్లడించెను. హిందూసంఘమునందలి దురభ్యాసములను తూర్పారబట్టెను. ఈశ్వరునియొక్క సమదృష్టిని గూర్చియు, సామరస్యమును గూర్చియు బోధించెను. జనులందఱును ఐకమత్యము కల్గి యేకకుటుంబమున జన్మించినవారివలె మెలగవలయునని చెప్పెను. భక్తివిధానమే జ్ఞాన, ముక్తి మార్గములకు మూలాధార మని ఉద్బోధించెను.

స్వామి దయానందుని మతసందేశము సింహగర్జనమువలె భారతదేశమునందంతటను ప్రతిధ్వనించెను. స్వర్ణస్వప్నమును గాంచినవారివలె జనులు మేల్కాంచి దయానందుని విజ్ఞానగీతములను బాడిరి.

మతవిషయమునందేకాక సంఘసంస్కరణమునగూడ దయానందుడు పాటుపడెను. వర్ణాశ్రమ ధర్మములను నిరాకరించెను. స్త్రీలకు విద్యయు, స్వాతంత్ర్యమును నత్యావశ్యకమని ఘోషించెను. వితంతూద్వాహమున కంగీకరించెను. అస్పృశ్యత నుండగూడ దనెను.

దయానందుడు స్వదేశాభిమానమునుగూడ బురికొల్పెను. దేశాభిమానమున్నగాని భారతదేశప్రజలు బాగుపడరని నొక్కి వక్కాణించెను. సత్యమార్గమును, ధర్మమార్గమును విడువక యెవరు వర్తింతురో యట్టివారే నిజముగ మానవజన్మకు అర్హులని దయానందుని సందేశము.

1883 అక్టోబరు 30వ తేది దీపావళి పండుగనాటి రాత్రి దయానందసరస్వతి సిద్ధి నొందెను. వానిజీవితకాలములో

దయానందుని బోధ లంతగా దేశమునందు నాటుకొనకపోయి నను, వానిశక్తి ఉత్తరహిందూస్థానమునం దంతటను నెలకొని యున్నది. నేడు భారతదేశమున పేరుగాంచిన మతసంస్థలలో ఆర్యసమాజము ఒకటి. దయానందుని బోధవలన గలిగిన ఫలితమే యిది. కాంగ్రి గురుకులాశ్రమము నేడు జాతీయవిద్యకు నాలవాలమై, దయానందుని దేశభక్తిచిహ్నముగ వెలయుచున్నది. కాన్పూరు, లాహోరు మొదలగు పట్టణమునందలి దయానంద విద్యాలయములు ఆ పుణ్యపురుషుని కీర్తినే గానము చేయుచున్నవి.

ఇప్పటిమతప్రవర్తకులలో, సంఘ సంస్కర్తలలో, దయానందసరస్వతి నుతింపదగినవాడు. ఈ మహనీయుని పవిత్ర జీవితము చిరస్మరణీయము, ఆదర్శప్రాయము.

తొమ్మిదవ కథ

## యుగంధరుడు

## 1

ప్రాకృతమున హైదరాబాదు సంస్థానమునందు గల వరంగల్ నగరము కాకతీయరాజరత్నమగు శ్రీ వీరప్రతాప రుద్రభూపాలుని కాలమున నాంధ్రరాష్ట్రమునకు రాజధానిగా వెలసెను. అలనా డారాజధానియొక్క వైభవమును కొనియాడుటకు వేనోళ్లు చాల వన్ననతిశయోక్తి కాజాలదు. ఇప్పుడా నగరభాగములను, కట్టడములను జూచిన ఆనాటి నగరపరిపూర్ణ సౌభాగ్య మెట్టిదాయని చూపరు లాశ్చర్యాన్వితులుగాక

తప్పరు. అట్టిరాజధానినుండి పరిపాలనము జేయుచుండిన వీర ప్రతాపరుద్రచక్రవర్తి పేరు నలుదెసల వ్యాపించి కీర్తింపబడు చుండెను. అతనిరాజ్యము ధర్మబద్ధమై, సస్యశ్యామలమై, సకలసంశోభితమై, సర్వసంపదలతో దులతూగుచుండెను.

శ్రీ ప్రతాపరుద్రుని శేముషి కంతకును ధీశాలురును, రాజభక్తిపరాయణులును నగు వానిమంత్రులతోడ్పాటు మూలకందమై యుండెను. అట్టిమంత్రులలో యుగంధరుడు ప్రధానామాత్యుడుగా నుండుట యా భూపాలుని పురాకృత విశేషమని చెప్పక తప్పదు.

యుగంధరుడు అప్రతిమానప్రతిభాశాలి. యుక్తియుత ముగ కార్యసాధన మొనర్పగల మంత్రశాలి. మొక్కవోని ప్రభుభక్తి పరాయణుడు. అట్టి యమాత్యశేఖరుని యండగా గల ప్రతాపరుద్రుని ప్రతాపమును గని యానాటి ఢిల్లీ నగరమును బాలించుచున్న తురుష్కరాజు ఘయాజుద్దీను టుగ్లాకుసుల్తాను ఓర్వజాలక వాని నెట్టులైన జయింప నెంచెను. పెక్కుపర్యాయములు తనసైన్యనివహంబుల నంపి ఓరుగల్లు (వరంగల్) నగరమును ముట్టడింప బ్రయత్నించెను. కాని యాతని సైన్యము లపారముగ నశించెను. అతనిప్రయత్నము లన్నియు విఫల మయ్యెను. అనారతము దన రక్షయగు యుగంధరుని సాయమున శ్రీ ప్రతాపరుద్రనరపతి శత్రు పక్షములను జయించుటజేసి సుల్తానున కాతని విజయనామము సింహస్వప్నముగ నుండెను. అట్టితఱి ప్రజ లెట్టిబాధల నెఱుగక భద్రతాయుతమగు రాజ్యమున సుఖముగనుండిరి.

భూపతియు చింతావివర్జితుడై యథేచ్ఛాపరుడై, ధర్మవర్తితము లం దొకప్పుడును, పండిత గోష్ఠియం దొకప్పుడును, మృగయా వినోదములం దొకప్పుడును కాలము బుచ్చుచుండెను.

కాని చింతాక్రాంతుడైన సుల్తాను తనపరాజయ మునకు మిగుల బరితపించుచు ఓరుగంటినృపాలుని నెట్లులైన చెఱబట్ట నుద్దేశించి వేచియుండెను.

## 2

రాజ్యము శాంతియుతముగ నుండుటగాంచి యుగంధరుడు దక్షిణదేశయాత్ర గావించి,రామేశ్వరము మొదలైన పుణ్యక్షేత్ర ముల దర్శింపగోరెను. పురాధీశుడును నందులకు వల్లె యనెను. సచివునకు కావలసిన సౌకర్యములను ముదముతో నేర్పాటు గావించెను. యుగంధరుడు పయన మగుచు—"రాజా, నేనుపుణ్య క్షేత్రయాత్ర గావించి త్వరితముగనే తిరిగి వచ్చెదను. దేశమును భద్రతతో గాపాడవలెను. పరాజితులైన శత్రువులు కుట్రలైన పన్ని వారిప్రతీకారము సల్పుటకు సందర్భమున కెదురుచూచు చుందురు. నేను తిరిగివచ్చువరకైన మీరు వేటకై చనక, ఏమఱి యుండక ప్రజలను బాలించుచుండవలెను.నామాటనాలింపుడు" అని మిక్కిలిగా హెచ్చరించెను. ప్రభువు సరియనెను. కాని 'కాలకర్మములు తప్పవుగా భువినెంతవారికిన్' అను నుడి నిజ మయ్యెను.

రాజ్యమంతయు ప్రశాంతముగ నుండ, పురాధీశునకు వేట దుర్వ్యసనముగ పరిణమించెను. అట్టితఱి యొకనాడు ప్రతాపరుద్రనరపతి వేటకై చని, పెక్కు శార్దూలములను

జంపి, కురంగములను దరిమి యలసి సేద తీర్చుకొనుటకునై యా విపినప్రాంతమున నొకచెఱువు దరి చేరి, దప్పిక తీర్చుకొని యచ్చటనే విశ్రమించెను. పరిచారకులును, నిజభటులును మాత్రము దగ్గర నుండిరి. ఆటవికులు దమనెలవులకు వెడలిరి.

యవనగూఢచారులు ప్రతాపరుద్రుని వ్యసన మెఱింగినవారై, యాతని నెన్నంటియే కాచియుండి, సమయమును సేనాపతుల కెఱింగించిరి. పొంచియుండిన దండనాథులు కాకతీయ భూపాలుని బంధించి వశపఱుచుకొని పయనమైరి.

ఏమరి మోసపోయిన మహీపతియొక్క విచారమునకు మేర లేదు. మంత్రిమాట పెడచెవినిబెట్టి తాను చేసిన యపరాధమునకు దగినశాస్తి జరిగెనని భావించెను. శోకింప బనిలేదని యెంచెను. కాని తనయేమరపాటువలన దేశమునకు ముప్పు వాటిల్లనున్నదని యెంతయు పరితపించెను.

## 3

ఆ కాలమున కాకతీయులలో నొక మహాకవియుండెను. ఆతనినామము విద్యానాథుడు. ఆ కవినాథుడు 'ప్రతాపరుద్రీయము' అను నొక యలంకారశాస్త్రమును రచించి, ప్రభువున కంకితము చేయనెంచి. వరంగల్ నగరమునుజేరి ఏలికను దర్శింప గోరెను. రాజు వేటకై చనిన వార్తను దెలిసికొని విద్యానాథుడు అటవికి జని, ప్రతాపరుద్రుడు తురుష్కులచే బందిగొనబడెనని యాటవికులవలన యెఱిగెను.

వెంటనే యాతడు గౌతమీ నదియొడ్డునచేరి చూడ నొక యోడ గానుపించెను. అందు యవనులు గోదావరిని దాటుచున్నారని గ్రహించెను. ప్రతాపరుద్రప్రభువు తప్పక నందుండునని నమ్మి, యుపాయము నాలోచించెను. భూపాలుని యందనురక్తి యుండుటం జేసి యుపాయము త్వరితముగ దోచెను. గొప్ప యీతనేర్చినవా డగుటవలన కవినాథుడు గౌతమీజలిల ములందు దుమికి, వేగముతో నీదుకొనుచు యవను లున్న నావ సామీప్యముచేరి, "మొసలులు దవులుచున్నవి. రక్షింపుడు, రక్షింపుడు!' అని మొఱపెట్టెను. నావలోనివా రప్పుడు వాని కొక దండము నందజేసి, వానిని లోనికి దీసికొని వానివృత్తాం తము నెఱుంగనెంచి ప్రశ్నించిరి.

విద్యానాథుడు తా నొకబీదకుటుంబీకుడననియు, భార్య మహావ్యాధిగ్రస్తురాలై యుండుటచే నౌషధము తెచ్చుకొని వచ్చుచున్నాడననియు, ఏటియావలగల గ్రామము చేరుటకు పడవ లభింపలేదనియు, ఆలసించిన ముప్పగునని యేటబడి యీద వలెనని సాహసించెననియు, మొసలులు వెంటబడెననియు— తన యుదంతమును వివరించెను. అతడు చలిచే వడకుచుండుటజూచి యాతనిని లోనికి జని విశ్రమింపుమని, సేనానులాజ్ఞ నిచ్చిరి.

విద్యానాథుడు అచ్చటనున్న కాకతీయనృపతిని గ్రహించి తడిసి తనయొద్దనున్న తాళపత్రగ్రంథమును తడియార దుడువ నారంభించెను. విద్యాభిమానియు, విద్యాభిలాషియు నగు ప్రభువు నకు గ్రంథ మేమైయుండునాయని తెలియ గుతూహలము గల్గి

యాతడు విద్యానాథు నడిగెను. "ఇది ప్రతాపరుద్రీయము అను నలంకారశాస్త్రము. దానిని వ్రాసి ప్రతాపరుద్రమహారాజున కంకిత మిచ్చి సన్మానము నొందు నుద్దేశముతో ఓరుగల్లు చేరితిని. భూపాలుడు నగరమునలేడట" యని విద్యానాథుడు విసుగున బదులుచెప్పెను. "అయిన నేమాయె? ఆ గ్రంథమును మఱి యొకరి కంకితము చేయకూడదా? అని రాజు పృచ్ఛచేసెను. "గ్రంథమునం దంతటను ప్రతిశ్లోకమునందును నాతనిపేరే చేర్చి యుంటిని. వేరొకరి కంకితముచేయ వీలుబడదు." అని కవినాథు డును బ్రత్యుత్తర మిచ్చెను. అంతట కాకతీయప్రభువు కొన్ని శ్లోకములను జదివించుకొని యానందపరవశు డయ్యెను. కవిని సత్కరించుటకు నవకాశము లేకపోయినందులకు జింతిల్లెను. తనయొద్దనున్న ముద్రాంగుళీయకమును నాతని కొసంగెను. దానిపై నున్న నామాంకితమును జూచి కవివరుడు సంతసించి "అనతికాలములో బంధవిముక్తుడవు కాగలవు" అని ప్రభువును దీవించెను.

వెంటనే యంగుళీయకమును భద్రపఱిచి విద్యానాథుడు పడవమీద కఱుదెంచెను. తిరిగి యుపాయము బన్ని, 'హా! దైవమా! మందు నీటిలో బడిపోయెనే! అయ్యో! నే నేమిచేయ వలయు'? ననుచు, నీటిలోనికి దుముకి, ఈదుకొని ఓరుగల్లు చేరు కొనెను. బందీకృతుడైన ప్రతాపరుద్రుడు ఢిల్లీనగరమునకు గొనిపోబడి చెఱయం దుంచబడెను.

